శ్రీత్రైక

సర్వేశ్వరాయనమః.

# సత్యవేదసంక్షేప

# సంగ్రహము.

రెండవకూర్పు 1,300 కాపీలు

GUNTUR.

1913.

**Nihil Obstat**

G. A. KAUFMANN.

*Censor Deputatus ad hoc.*

**Imprimatur**

† JOHANNES AELEN,

*Archiep Madrasp.*

GUNTUR,

*1st October 1913.*

# అమృతాధారము.

---

## స్లీవగురుతు మంత్రము.

అర్చ్యశిష్టస్లీవయొక్క గురుతుచేత, మాయొక్క శత్రువులనుండి మమ్మురక్షించుకొనండి, మాయొక్క సర్వేశ్వరా, పితయొక్కయు, సుతునియొక్కయు, స్పిరితుసాంత్తుయొక్కయు నామముచేత, ఆమెన్ జేసు.

---

# మంత్రములు.

---

## త్రీత్వస్తోత్రము.

పితకునుసుతునికిని స్పిరితు సాంత్తునకును స్తోత్రము కలుగునుగాక. ఆదిలోకలిగినట్టు ఇప్పుడును ఎప్పుడును అనాది సదాకాలముస్తోత్రము కలుగునుగాక.

ఆమెన్ జేసు.

---

## జ్యోతిశ్చక్రమంత్రము.

జ్యోతిశ్చక్రాలయందుండెడు మాయొక్క తండ్రీ! మీ నామము అర్చింపబడును గాక. మీ రాజ్యము వచ్చునుగాక; మీచిత్తము జ్యోతిశ్చక్రమందు చేయబడునట్లు భూమియందును చేయబడును గాక. నానాటికి కావలసిన మాయన్నము మాకు నేటికియ్యండి, మా యప్పులవారికి మేము ఓర్చునట్లు మాయప్పులను మీరు ఓర్వండి. మమ్ము శోధనయందు ప్రవేశింప చేయకుండ కీడునుండి మమ్ము రక్షించుకొనండి.

ఆమెన్ జేసు.

## ప్రియదత్త మంత్రము.

ప్రియదత్తముచేత నిండిన మరియమ్మా, వందనము. స్వామి మీయందు; స్త్రీలలోపల ఆశీర్వదింపబడ్డవారు మీరే; మీ ఉదరఫలమనెడు జేసు ఆశీర్వదింపబడ్డ వారవునే. అర్చ్య. మరియమ్మా, సర్వేశ్వరునియొక్క మాతా, పాపాత్ములమైయుండెడు మాకొరకుగాను ఇప్పుడును మామరణసమయమందును ప్రార్థించుకొనండి. ఆమెన్ జేసు.

---

# అపోస్తులు ఏర్పరచిన విశ్వాసమంత్రము.

జ్యోతిశ్చక్రమును భూలోకమును సృష్టించిన సర్వవల్లభుడైన పితయైన సర్వేశ్వరుని అంత్యోగ్య భక్తిచేత విశ్వసించుచున్నాను. అతనియొక్క యేక సుతుడైన మనయొక్క నాథుడైన జేసుక్రీస్తువును అంత్యోగ్యభక్తిచేత విశ్వసించుచున్నాను. ఇతడు స్పిరితు సాంక్తువల్ల గర్భమై యుద్భవించి కన్య మరియమ్మనుండి పుట్టినారు; పోంస్యుపిలాతు క్రింద ఉపద్రవపడి స్లీవయందు మొలలుకొని కొట్టబడి మరణముపొంది సమాధిలో స్థాపింపబడినారు; వారు పాతాళమునకు దిగి మూడవ నాడు మృతిమైనవారి లోనుండి లేచినారు. జ్యోతిశ్చక్రములకు నెంచేసి సర్వవల్లభుడైన పితయైన సర్వేశ్వరుని దక్షిణపార్శ్వమునకూర్చున్నారు; అట నుండి బ్రతికిన వారలకును చచ్చినవారలకును న్యాయనిర్ణయము చేయవత్తురు. స్పిరితుసాంక్తును అంత్యోగ్య భక్తిచేత విశ్వసించుచున్నాను. పొత్తులుగానుండెడు అర్చ్యశిష్టసభను, అర్చ్యశిష్టవారలయొక్క సముదిత ప్రసా--జనమును విశ్వసించుచున్నాను. పాపక్షయమునువిశ్వసించుచు

న్నాను. మాంసపు ఉత్థానమును విశ్వసించుచున్నా
ను. సతతమైనజీవమును విశ్వసించుచున్నాను. ఆ.జే.

---

## పదికల్పనలు.

సర్వేశ్వరుడు మనకానతిచ్చిన వేదకల్పనలు పది:—

1. సర్వేశ్వరునికి ఒక్కరికిమాత్రము ఆరాధన చేయుదువుగాక. 2. సర్వేశ్వరునియొక్క దివ్యనామము వ్యర్థముగా స్వీకరింపక ఉందువుగాక. 3. సర్వేశ్వరునియొక్క ఉత్సవదివసములను ఆచరింప తలంచుదువుగాక. 4. తల్లిదండ్రాదులను బహుమానముగా నడుపుదువుగాక. 5. నరహత్యచేయక ఉందువుకాక. 6. మోహ అగమ్యాగమనము చేయక ఉందువుగాక. 7. దొంగలింపక ఉందువుగాక. 8. దబ్బరసాక్షి పలుకక ఉందువుగాక. 9. పరదారను అపేక్షింపక ఉందువుగాక. 10. పరుల సొమ్ములకు ఆశపడక ఉందువుగాక.

ఈ పదికల్పనలును రెండుకల్పనలలో అణగుచున్నవి.

1. సకలవస్తులవులమీద పెట్టిన పక్షానికన్న సర్వేశ్వరునిమీద అధికభక్తికలిగి ఉండుట. 2 తన్ను

తాను స్నేహించునట్లు సమస్త జనులను స్నేహించుట. ఆ. జే.

## అర్చ్యి సభ కట్టడచేసిన కల్పనలు ఆరు.

1. ఆదివారము అప్పు పండుగలను ఆచరించి నిండువూజకనుట. 2. ఏడాదికి ఒక్కసారియైనను పాపసంకీర్తనముచేయుట. 3. పాస్కపండుగల లో సత్ప్రసాదానికి ఆయత్తముగా నుండుట.

4. శుక్రవారము తపస్సుకాలము మొదలైనశుద్ధ భోజన దినములందు మాంసమును వర్జించి, అర్చ్యిశిష్ట సభ కట్టడచేసిన దినములలో ఒక్కప్రొద్దుగా నుండుట. 5. తొలగింపబడిన కాలమందును, తక్కువ ప్రాయమందును, విఘ్నముగల చుట్టరికమందును వివాహము చేయకయుండుట. 6. మన [illegible] గురువుల సంరక్షణకు గాను సహాయముచేయుట.

ఆమోకేసు.

## పాప సంకీర్తన మంత్రము.

సర్వశక్తుడైన సర్వేశ్వరునితోను ఎప్పుడును కన్యకగానుండెడుముక్తిబొందిన అర్చ్యిశిష్టమరియమ్మ

తోను, ప్రధానసన్మనస్కుగా నుండెడు మోక్ష భాగ్యవంతులైన మిఖేలుతోను, స్నాపకులైయుండెడు మోక్షభాగ్యవంతులైన అరుళప్పతోను, అర్చ్యశిష్ట అపోస్తులైన రాయప్పతోను, చిన్నప్ప తోను, సకల అర్చ్యశిష్టవాగలతోను, నాకు గురువులైయుండెడు వీాతో నును పాపసంకీర్తనము చేయుచున్నాను. ఏలనని: విచారము చేతను, వాక్కుచేతను, క్రియలచేతను, ాహు పాపము లుచేసితిని: నామీాదతప్పు, నామీాదతప్పు, నామీాద దొడ్డ తప్పు. అందుచేత ఎప్పుడునుకన్యకగానుండెడు ము క్తిపొందిన అర్చ్యశిష్ట మరియ మ్మనును, ప్రధానసన్మ నస్కుగా నుండెడు మోక్షభాగ్యవంతులైన మిఖేలు నును, స్నాపకులైయుండెడు మోక్షభాగ్యవంతులైన అరుళప్పనును, అర్చ్యశిష్ట అపోస్తులైన రాయ ప్పనును చిన్నప్పనును, సకల అర్చ్యశిష్టవాగలను నాకు గురువులైయుండెడు మిమ్ములనున్నానుకర్తయు యుండెడు సర్వేశ్వరుని నాకొరకై వేడుకొనుమని వేడుకొనుచున్నాను ఆమెన్ జేసు.

## ఉత్తమమునస్తాప మంత్రము.

సర్వేశ్వరా స్వామీ! దేవరవారు కడగురుతు

లేని సకలమేలుల స్వభావము గానుండుటవలన అంతటి కన్న మిమ్ము నేను స్నేహించియున్నాను స్వామీ! మీకు పొందని పాపములను నేను చేసినందువలన మహా మనస్తాపముగానున్నాను స్వామీ, మహా దుఃఖముగానున్నాను స్వామీ మహా ఉత్తమ మనస్తాపముగానున్నాను స్వామీ ఇకమీదట ఒక్క నాటికిని ఎటువంటిపాపములను చేయుటలేదని గట్టి మనస్సుతో ప్రతిజ్ఞచేయుచున్నాను స్వామీ! జేసు నాధస్వామి పాటుపడి చిందబోసిన దివ్యరక్తఫలము లనుచూచి నాపాపాలన్ని ఓర్చి నాకు మోక్షభాగ్య మిత్తురని గట్టిగానమ్మియున్నానుస్వామీ! అర్చ్యశిష్ట సభ విశ్వసించి, యుపదేశించునదంతాను తప్పులేని సత్యస్వరూపిగానుండేడు దేవరవా - మా కానతిచ్చి నందువల్లఅనుమానములేక పరిపూర్ణవిశ్వాసముతో నిండుమనస్సుతో నిశ్చయి.చుచున్నానుస్వామీ. ఆ. జే.

## త్రికాల జపము.

ఏలినవారియొక్క సన్మనస్కుడు మరియమ్మతో విశేషముచెప్పెను ఆయమ్మ స్పిరితుసాంక్తువల్లగర్భము ధరించెను. ప్రియ.

ఇదిగో ఏలినవారియొక్క దాసిగాలను; మీకు

మందలించిన మాటచొప్పున నాకవునుగాత. ప్రియ. మతుడైన సర్వేశ్వరుడు మనుష్యావతారము చేసిరి: మరియు మనలోకూడ వాసమైయుండిరి ప్రియ .

ఒ: జేసుక్రీస్తునాథుని దివ్యవాగ్దత్తములకు మేము పాత్రులమగునట్టు

అం: సర్వేశ్వరునియొక్క పరిశుద్ధమాతా! మా కొరకు వేడుకొనండి.

## ప్రార్థించుదము.

సర్వేశ్వరాస్వామీ, సన్మనస్కు చెప్పినందువల్ల మీకు బిడ్డగానుండెడు జేసుక్రీస్తువు మనుష్యుడైనది తెలిసికొంటిమే. వారియొక్క పాటులవల్లను స్లీవ వల్లనునుఉత్థానముయొక్కమహిమను మేము పొందు నట్టుగా మాకు అనుగ్రహము చేయనవధరింపవలెనని దేవరవారిని వేడుకొనుచున్నాము. ఈవేడుదలనంత జేసునాథస్వామియొక్క దివ్యసుఖమునుజూచిమాకు దయచేయండి. ఆమెన్ జేసు.

## దైవీక పుణ్యక్రియలు.

## విశ్వాసక్రియ.

నాసర్వేశ్వరా స్వామీ! అర్చ్యశిష్టసభ విశ్వ

సించి చదివించెడు సత్యములన్నిటిని సత్యస్వరూపిగా నుండు దేవరవారు తామే తెలిపినందువల్ల నేనున్ను దృఢముగా విశ్వసించుచున్నాను. ఆమెన్ జేసు.

---

## నమ్మిక క్రియ.

నా సర్వేశ్వరాస్వామీ! సర్వనమ్మికమునకు పాత్రులుగానుండు దేవరవారు వాగ్దత్తము చేసినందువల్ల జేసునాధస్వామి పాటుబడిన పుణ్యఫలములను జూచి నాపాపములన్ని ఓర్చి నాకు మీయొక్క వరప్రసాదములను, మోక్షభాగ్యమును కృపచేయుదురని దృఢముగా నమ్మియున్నాను. ఆ. జే.

## దేవస్నేహ క్రియ.

నా సర్వేశ్వరాస్వామీ! సకలమేలుల స్వభావముగానుండు దేవరవారు మట్టులేని స్నేహమునకు పాత్రులుగా నుండుటవల్ల అంతిటికన్న మమ్ము నేను నిండు మనస్సుతో స్నేహించుచున్నాను. నాసర్వేశ్వరా, మిమ్ముజూచి నన్ను నేను స్నేహించెడుప్రకారముసమస్తజనులను స్నేహించుచున్నాను. ఆ. జే.

# దైవస్తుతులు.

దేవుడు స్తుతింపబడుదురుగాక.

వారి పరిశుద్ధనామము స్తుతింపబడునుగాక.

నిజ దేవుడును నిజమనుష్యుడు నైన జేసు క్రీస్తువు స్తుతింప బడుదురుగాక.

జేసువుయొక్క నామము స్తుతింపబడునుగాక.

వారిమిక్కిలి అర్పితహృదయము స్తుతింపబడునుగాక.

పీఠముయొక్క మిగుల పరిశుద్ధ దేవద్రవ్యానుమానమందు దేవుడు స్తుతింపబడుదురుగాక.

దేవుని గొప్పతల్లియగు మిక్కిలి పరిశుద్ధ మరియమ్మ స్తుతింపబడుదురుగాక.

వారి పరిశుద్ధమును నిష్కళంకమునైన. ఉద్భవము స్తుతింపబడునుగాక.

కన్యకయును తల్లియునైన మరియమ్మగారి నామము స్తుతింపబడునుగాక.

తమ దూతలయందును తమ అర్చ్య శిష్టులయందును దేవుడు స్తుతింప బడుదురుగాక.



# జ్ఞానోపదేశము.

## సత్యబోధసంగ్రహము.

### 1-ప్రకరణము.

### ఏకత్రిత్వ సర్వేశ్వరునిగురించి

ప్రశ్న. సర్వమునకు కర్తగానుండెడువారెవ్వరు?
ఉత్తరము సర్వేశ్వరుడు.
ప్ర. ఎందరు సర్వేశ్వరులు?
ఉ. ఒకే సర్వేశ్వరుడు.
ప్ర. వారెట్లు ఉన్నారు?
ఉ. త్రిత్వముగా నున్నారు.
ప్ర. త్రిత్వముగానున్నారనుటకు అర్థమేమి?
ఉ. సర్వేశ్వరుడు దైవత్వమున ఒకరుగా నుండినను వ్యక్తిత్వమున ముగ్గురుగానున్నారని అర్థము.
ప్ర. ఆముగ్గురికి పేరేమి?
ఉ. పిత. సుతుడు, స్పిరితుసాంక్తు.
ప్ర. పిత సర్వేశ్వరుడా?
ఉ. సర్వేశ్వరుడు.

ప్ర. సుతుడు సర్వేశ్వరుడా?
ఉ. సర్వేశ్వరుడు.
ప్ర. స్పిరితుసాంక్తు సర్వేశ్వరుడా?
ఉ. సర్వేశ్వరుడు.
ప్ర. ఈముగ్వురును ముగ్గురు సర్వేశ్వరులా ఒకే సర్వేశ్వరుడా?
ఉ. ఒకే సర్వేశ్వరుడు.
ప్ర. ఎట్లు ఒకే సర్వేశ్వరుడు?
ఉ. ఈముగ్గురికిని ఒకే జ్ఞానము, ఒకే చిత్తము, ఒకే బలిమి, ఒకే దేవస్వభావమును, ఉండుటవలన ముగ్గురును ఒకే సర్వేశ్వరుడైయున్నారు.
ప్ర. వీరలయందు బలిమి మహిమ మొదలైన లక్షణములలో వ్యత్యాసము కలదా?
ఉ. లేదు. ముగ్గురు అన్నిటిలో సరిసమానులు.
ప్ర. వీరిలో మొదటివారును వెనుకటివారును కద్దా?
ఉ. లేదు.
ప్ర. ఎందుచేత లేదు?
ఉ. పిత అనాది, సుతుడు అనాది, స్పిరితుసాంక్తు అనాది, ముగ్గురును అనాదిగానుండుటవలన వీరిలో మొదటివారు లేరు వెనుకటివారులేరు.

ప్ర. ఇట్లు ఏకత్రిత్వమైన సర్వేశ్వరునికి ప్రధాన లక్షణములెన్ని?

ఉ. ఆరు.

ప్ర. ఆ యారును చెప్పుము?

ఉ. 1_ది సర్వేశ్వరుడు తామైయున్నారు. 2_ది అనాదిగానున్నారు. 3_ది శరీరములేక ఉన్నారు. 4_ది కడగురుతులేని సకల మేలుల స్వభావముగా ఉన్నారు. 5_ది ఎందునువ్యాపించియున్నారు. 6_ది అంతటికిని ఆదికారణమైయున్నారు.

---

## 2_వ ప్రకరణము.

## లోక సృష్టియును మనుష్యునియొక్క చేటును గురించి.

ప్ర. సర్వేశ్వరుడు ఎట్లు అంతటికిని ఆదికారణమైయున్నారు?

ఉ. పరలోకమునుమ భూలోకమునును వానిలోనుండెడు సకలమును సృష్టించి కాపాడుటవలన అంతటికిని ఆదికారణమైయున్నారు.

ప్ర. వారు సృష్టించినవస్తువులలో ప్రధానమైనవియేవి?

ఉ. అశరీరులైన సన్మనస్కులును ఆత్మశరీరముగల మనుష్యులును.

ప్ర. సర్వేశ్వరుడు సన్మనస్కులను ఎటువంటి స్థితిలో సృష్టించినారు?

ఉ. పరిశుద్ధమును సుఖమునైనస్థితిలో సృష్టించినారు

ప్ర. సన్మనస్కులందరును తమ శ్రేష్ఠమైనస్థితిలో నెలకొనియుండిరా?

ఉ. లేదు. కొందరు అహంకారముచేత మోక్షమును పోగొట్టుకొని నరకాజ్ఞకు లోబడిరి.

ప్ర. ఇట్లు చెడిపోయిన సన్మనస్కులకు పేరేమి?

ఉ. పిశాచులు.

ప్ర. సర్వేశ్వరుడు మనుష్యులను ఎందుకు సృష్టించినారు?

ఉ. తమ్మునుఎరిగి, స్నేహించి సేవింపను, అందువల్ల మోక్షముపొందను, సృష్టించినారు.

ప్ర. వారు ఆదితల్లిని ఆదితండ్రిని ఏస్థితిలో సృష్టించినారు?

ఉ. పరిశుద్ధమును భాగ్యమునైన స్థితిలో వారలను సృష్టించినారు.

ప్ర. వారలు దానిని ఎట్లు పోగొట్టుకొనిరి?

ఉ. పిశాచినినమ్మి సర్వేశ్వరునివలన తొలగింపబడిన పండును తినినందుచేత పోగొట్టుకొనిరి.

ప్ర. అందుకై వారలకును వారలసంతతికిని వచ్చిన ఆజ్ఞయేమి?

ఉ. పిశాచికిదాసులై, మరణము నరకము మొదలైన యాజ్ఞలకు పాత్రులైరి.

---

3_వ ప్రకరణము.

## మనుష్యుల రక్షణమును గురించి.

ప్ర. మనుష్యుల రక్షించుటకై నరుడై జన్మించిన వారెవరు?

ఉ. అర్చ్యశిష్ట త్రీత్వముయొక్క రెండవవారైన సుతుడైన సర్వేశ్వరుడు.

ప్ర. వారేలాగున ఉద్భవించి పుట్టినారు?

ఉ. స్పిరితుసాంక్తుడైన సర్వేశ్వరునివలన గర్భమై యుద్భవించి యద్భుతముగా పుట్టినారు.

ప్ర. ఎవరియొద్దనుంచి పుట్టినారు?

ఉ. ఎప్పటికిని కన్యమహిమ చెడని అర్చ్యశిష్ట కన్య మరియమ్మయొద్దనుండి పుట్టినారు.

ప్ర. స్వామిపుట్టిన ఎనిమిదవనాడు వారికేమిపేరు పెట్టినారు?

ఉ. జేసువనెడు పేరుపెట్టినారు.

ప్ర. జేసువనెడు పేరుకు అర్థమేమి?

ఉ. మనలను రక్షించెడివారు.

ప్ర. జేసునాథస్వామి ఈలోకములో ఎన్ని సంవత్సరము లుండిరి?

ఉ. ముప్పదిమూడు సంవత్సరములు.

ప్ర. ఈలోకమునందు ఏమిచేయుచు వచ్చిరి?

ఉ. సకలపుణ్యములను, అద్భుతములనుచేసి, తమ దివ్య వేదమును బోధించి, అపోస్తులనుఏర్పరచిరి.

ప్ర. జేసునాథస్వామికి ఎన్ని స్వభావములుకలవు?

ఉ. దేవస్వభావము, మనుష్యస్వభావము, ఈరెండు స్వభావములు కలవు.

ప్ర. ఏస్వభావములో పాటుపడినారు?

ఉ. మనుష్యస్వభావములో పాటుపడినారు.

ప్ర. ఎవరికొరకు పాటుపడినారు?

ఉ. మనకొరకు పాటుపడినారు.

ప్ర. ఏలాగున పాటుపడినారు?

ఉ. పోంస్యుపిలాతుని అధికారములో మిక్కిలి పా టుపడి, స్లీవయందు కొట్టబడి కఠినమైన మరణ మునుపొంది సమాధిగా స్థాపింపబడిరి.

ప్ర. అప్పుడు స్వామియొక్క దివ్యఆత్మ యెక్కడికి పోయెను?

ఉ. పాతాళమునకుదిగి అచ్చటి పుణ్యాత్ములకు మో క్షభాగ్యము నియ్యబోయెను.

ప్ర. జేసునాధుడు సమాధిలోనుండి జీవంతులై లేచి నారా?

ఉ. మృతమైన మూడవనాడు జీవంతులై లేచినారు.

ప్ర. జీవంతులై లేచినవెనుక భూలోకములో ఎన్ని దినములుండిరి?

ఉ. నలువదిదినములుండిరి.

ప్ర. ఆనలువదిదినము లేమిచేయుచువచ్చిరి?

ఉ. పలుమారు తమ శిష్యులకు ప్రత్యక్షముగా దర్శన మై వారలను వేదసత్యములయందు స్థిరపరచుచు వచ్చి

ప్ర. నలుబదియవ దినమెక్కడికి వేంచేసిరి?

ఉ. పరలోకమునకు వేంచేసి, సర్వబలముగల పిత

రైన సర్వేశ్వరునియొక్క కుడిపార్శ్వమున కూర్చున్నారు.

ప్ర. ఇప్పుడు జేసునాథస్వామి ఎక్కడఉన్నారు?

ఉ. దేవస్వభావములో ఎందునుఉన్నారు. మనుష్యస్వభావములో పరలోకమందును సత్ప్రసాదమందును ఉన్నారు.

---

4-వ ప్రకరణము.

## స్పిరితుసాంక్తుయొక్క ఆగమనమునను అర్చ్యశిష్టసభనను గురించి.

ప్ర. జేసునాథస్వామి పరలోకమునకు వేంచేసిన పదియవదినమందేమిచేసిరి?

ఉ. తమయొక్క అపోస్తులకు దృష్టముగా స్పిరితుసాంక్తును అంపినారు.

ప్ర. స్పిరితుసాంక్తును పొందినవెనుక అపోస్తులేమి చేసిరి?

ఉ. లోకమంతటను ప్రసంగించి అర్చ్యశిష్ట సభను స్థాపించిరి.

ప్ర. అర్చ్యశిష్టసభకు తలగానుండెడు వారెవ్వరు?

ఉ. జేసునాధస్వామి.

ప్ర. వారు తమకుబదులుగా॥ప్రత్యేకమైన తలగా ఎవరిని స్థాపించినారు?

ఉ. అర్చ్యశిష్ట రాయప్పగారిని స్థాపించినారు.

ప్ర. అర్చ్యశిష్ట రాయప్పగారికి బదులుగా అర్చ్యశిష్ట సభకు తలగానుండెడువారెవరు?

ఉ. అర్చ్యశిష్టపాపుగారు.

ప్ర. కడమఅపోస్తులకు బదులుగానుండెడువారెవరు?

ఉ. మేత్రాణులు.

ప్ర. జేసునాధుడును అపోస్తులును ఎన్ని సభలను స్థాపించినారు?

ఉ. కతోలిక్ అనెడు ఒకే అర్చ్యశిష్ట సభను, మాత్రము స్థాపించినారు.

ప్ర.అందుకు వెలిగానుండెడువారలకు మోక్షముకలదా?

ఉ. లేదు.

ప్ర. లేదనుటకు దృష్టాంతమేమి?

ఉ. అర్చ్యశిష్టసభయొక్క మాటను విననివాడు అజ్ఞానివలె నీకుకాగలవాడని మనకర్త ఆనతిచ్చిరి.

## ౯-వ ప్రకరణము.

### మనుష్యునియొక్క ముగింపునుగూర్చి.

ప్ర. పాపమునిమిత్తము సకలమనుష్యులకు వచ్చెడు ఆజ్ఞయేమి?

ఉ. మరణము.

ప్ర. మరణమునకు వెనుక సంభవించునదేమి?

ఉ. ప్రత్యేకతీర్పు.

ప్ర. ప్రత్యేకతీర్పునకు వెనుక చావైన పాపముగల ఆత్మలు ఎక్కడికిపోవును?

ఉ. నరకమునకుపోవును.

ప్ర. పరిశుద్ధాత్మలు ఎక్కడికిపోవును?

ఉ. మోక్షమునకు పోవును.

ప్ర. తమ పాపముల నిమిత్తము పూర్తిగా ఉత్తరించని పుణ్యాత్ములు ఎక్కడికిపోదురు?

ఉ. ఉత్తరించెడు స్థలమునకు పోదురు.

ప్ర. ఉత్తరించెడుస్థలములో ఎట్లు ఉందురు?

ఉ. తమపాపములకు తగిన వేదనపొంది యుత్తరించుదురు. పూర్తిగా ఉత్తరించినవెనుక మోక్షము పొందుదురు.

ప్ర. ప్రత్యేకతీర్పుగాక వేరొక తీర్పుగలదా?

ఉ. సాధారణతీర్పుగలదు.

ప్ర. అది యెప్పుడు జరుగును?

ఉ. లోకాంత్యమందు జరుగును.

ప్ర. లోక మెట్లుముగియును?

ఉ. లోకమంతయు అగ్నిచేత దగ్ధమై మనుష్యులం దరును మృత్యులగుదురు.

ప్ర. మరియు ఏమి సంభవించును?

ఉ. జేసునాధస్వామి మనుష్యులందరిని ఆత్మశరీరము లతో లేపి మహాప్రతాపముతో న్యాయనిర్ణయ ము చేయవత్తురు.

ప్ర. న్యాయనిర్ణయము ఎట్లుచేయుదురు?

ఉ. వానివాని పాపపుణ్యములను సమస్తుల కెదుట తెలియపఱచి, పాపాత్ములను శపించి నరకములో త్రోసి, పుణ్యాత్ములను ఆశీర్వదించి, మోక్షము నకు తోడుకొనిపోదురు.

ప్ర. పాపాత్ములునరకమందుఅనుభవించెడుఆజ్ఞ ఏమి?

ఊ. సర్వేశ్వరుని ఎన్నటికిని దర్శింపక కలంతకాల ము పిశాచులతో అగ్నియందు కాలి సర్వబాధ లను అనుభవించుచున్నారు.

ప్ర. పుణ్యాత్ములు మోక్షములో అనుభవించెడు భాగ్యమేమి?
ఉ. సర్వేశ్వరుని ప్రత్యక్షముగా దర్శించి ఎప్పటికిని సకలభాగ్యములను అనుభవించుచున్నారు.

---

6-వ ప్రకరణము.

కల్పనలనును పాపములనును గూర్చి.

ప్ర. మోక్షమును పొందుటకు వేదసత్యములను విశ్వసించుటమాత్రముచాలునా?
ఉ. చాలదు. సర్వేశ్వరునియొక్క కల్పనలను అర్చ్యశిష్టసభయొక్క కట్టడలను అనుసరించి పాపమును వర్జించి పుణ్యమును చేయవలెను.
ప్ర. సర్వేశ్వరునియొక్క కల్పనలెన్ని?
ఉ. పది.
ప్ర. పదియును చెప్పుము?
ఉ. మొదటిది, సర్వేశ్వరునికి ఒక్కనికి మాత్రము ఆరాధనచేయుదువుగాక మొదలైనవి.
ప్ర. అర్చ్యశిష్టసభ కట్టడలెన్ని?
ఉ. ఆరు.
ప్ర. ఆరును చెప్పుము?

ఉ. మొదటిది, ఆదివారము అప్పుపండుగలు ఆచరించి నిండుపూజ కనుట, మొదలైనవి.

ప్ర. పాపమనగా నేమి?

ఉ. దైవకల్పన మీరుటే పాపము.

ప్ర. పాప మెన్ని విధములుగానున్నది?

ఉ. జన్మపాపము, కర్మపాపము అని। రెండువిధములుగా నున్నది.

ప్ర. జన్మపాపమనగా నేమి?

ఉ. ఆదితల్లి ఆదితండ్రీవలన గలిగి మనతో కూడా పుట్టెడు పాపము జన్మపాప మనబడును.

ప్ర. కర్మపాపమనగా నేమి?

ఉ. బుద్ధి వివరము తెలిసిన వెనుక మనసొప్పి చేయు పాపము.

ప్ర. కర్మపాప మెన్ని విధములుగానున్నది?

ఉ. చావైనపాపము, స్వల్పపాపమని రెండు విధములుగా నున్నది.

ప్ర. చావైనపాపమనగా నేమి?

ఉ. దేవయిష్టప్రసాదమును పోగొట్టి మనలను నరకమునకు పాత్రులుగా చేయుపాపము.

ప్ర. స్వల్పపాపమనగా నేమి?

ఉ. దేవయిష్టప్రసాదమును తగ్గించి చావైనపాపము నకు ద్రోవయై మనలను ఉత్తరించెడు స్థలమునకు పాత్రులుగా చేయుపాపము.

7_వ ప్రకరణము.

## దేవానుగ్రహముయొక్క అవసరమునును, జపమునును, దేవద్రవ్యానుపాన ములనును గూర్చి.

ప్ర. పాపములను వర్జించి మోక్షమును పొందుటకు మనయొక్క స్వంతబలము చాలునా?

ఉ. చాలదు. దేవవరప్రసాదము కావలెను.

ప్ర. దేవ వరప్రసాదమనగా నేమి?

ఉ. మనము నరకము తప్పించుకొని మోక్షముపొందుటకు సర్వేశ్వరుడు జేసుక్రీస్తునాధునియొక్కదివ్య రక్తఫలములనుజూచి మనకు ఉచితముగానియ్యన వధరించెడు మేలైనవరమే దేవవరప్రసాదమగును.

ప్ర. దేవవరప్రసాదమును ఎట్లు పొందవచ్చును?

ఉ. జపముచేతను, దేవద్రవ్య అనుపానములచేతను పొందవచ్చును.

ప్ర. జపమనగా నేమి?

ఉ. మనము కూడినమాత్రము భక్తితోను, వినయము తోను, సర్వేశ్వరుని సన్నిధిలోనుండి మనము పొందినయుపకారమునిమిత్తమై వారికి స్తోత్రము చేసి బ్రతుకుటకును మోక్షముపొందుటకును కావలసిన మేలులను మనకియ్యనవధరింపవలెనని వారిని వేడుకొనుటే జపము.

ప్ర. ఏలాగు జపము చేయవలెను?

ఉ. అవధానముతోను, దీనత్వముతోను, నమ్మికతోను, నిలకడతోను చేయవలెను.

ప్ర. అడుగడుగునకు జపముచేయవలెనా?

ఉ. చేయవలెనని మనకర్త ఆజ్ఞాపించిరి.

ప్ర. దేవద్రవ్య అనుమానమనగా నేమి?

ఉ. దేవానుగ్రహమును ఇచ్చుటకుగాను యేసునాథస్వామిచేత స్థాపింపబడిన దృశ్యమైన అడియాలము.

ప్ర. దేవద్రవ్య అనుమానము లెన్ని?

ఉ. ఏడు.

ప్ర. ఏడును చెప్పుము?

ఉ. 1-ది జ్ఞానస్నానము; 2-ది భద్రమైన అభ్యంగము; 3-ది ప్రత్ప్రసాదము; 4-ది పశ్చాత్తాపము;

5_ది అవస్థాభ్యాంగము; 6_ది గురుపట్టము; 7_ది జ్ఞానవివాహము.

ప్ర. జ్ఞానస్నానమనగా నేమి?

ఉ. జన్మపాపమునును కర్మపాపమునును పోగొట్టి మనలను సర్వేశ్వరునికిని అర్చ్యశిష్ట సభకును బిడ్డలుగా చేయు దేవద్రవ్యానుమానము.

ప్ర. భద్రమైన అభ్యాంగమనగా నేమి?

ఉ. మనలను సత్యవేదములో దృఢపరచుటకు స్పిరితుసాంక్తునును వారియొక్క వరప్రసాదములనును సంపూర్ణముగా నిచ్చి, మనలను ఉత్తమక్రీస్తువులుగా చేయు దేవద్రవ్యానుమానము.

ప్ర. సత్ప్రసాదమనగా నేమి?

ఉ. గోధుమ అప్పముయొక్క గుణములలోను, ద్రాక్షరసముయొక్క గుణములలోను, జేసునాథస్వామియొక్క దివ్యశరీరమును దివ్యరక్తమును దివ్యఆత్మమును దేవస్వభావమును అణగియుండు దేవద్రవ్యానుమానము.

ప్ర. పశ్చాత్తాపమనగా నేమి?

ఉ. జ్ఞానస్నానముతీసినవెనుక చేసినపాపముల నెల్ల విమోచనముచేయు దేవద్రవ్యానుమానము.

ప్ర. అవస్థాభాగ్యంగమనగా నేమి?

ఉ. వ్యాధిగ్రస్థులయందు మిగతపాపములకు పరిహార మునను, వారల యాత్మశరీరములకు ఆదరమును ను ఇచ్చెడు దేవద్రవ్యానుమానము.

ప్ర. గురుపట్టమనగా నేమి?

ఉ. దివ్యపూజచేయనును, దేవద్రవ్యానుమానములను సెరవేర్చనును, స్వతంత్రమును ఇచ్చెడు దేవద్ర వ్యానుమానము.

ప్ర. జ్ఞానవివాహమనగా నేమి?

ఉ. సంసారులు అయ్యెడువారలకు దేవాశీర్వాదము నును వారలు సన్మార్గమందు ప్రవర్తించి తమబి డ్డలను తగినట్టుగానడిపింప కావలసిన దేవసహాయ మునును ఇచ్చెడు దేవద్రవ్యానుమానము.

జ్ఞానస్నానమిచ్చెడు విధము.

ప్ర. జ్ఞానస్నానమిచ్చెడు విధమెట్లు?

ఉ. 1_ది అర్చ్యశిష్టసభ జ్ఞానస్నానమిచ్చెడుతలంపు తో నేనును జ్ఞానస్నానమిచ్చుచున్నానని మన స్సులో తలంచుకొనుట.

2_ది. బిడ్డకు ఉంచవలసిన పేరు విశదముగా ఉచ్చ రించి, దానితలమీద నీళ్ళుబోయునప్పుడే తానే

చెప్పవలసినది:

పితయొక్కయు † సుతునియొక్కయు † స్పిరితుసాంతుయొక్కయు † నామముచేత నేను నిన్ను కడుగుచున్నాను.

ప్ర. అవస్థసమయములో ఎవరైనను జ్ఞానస్నానమియ్యవచ్చునా?

ఉ. అటువంటిసమయమందు ఎవరయినను ఇయ్యవచ్చును.

ప్ర. పాపసంకీర్తనముచేయుట కెన్ని కార్యములు కావలెను?

ఉ. ఐదు. 1_ది. తానుచేసినపాపము లన్నిటిని తలంచుట; 2_వ. చేసినపాపములకొరకుగాను దుఃఖమనస్తాపపడుట; 3_ది. ఇకమీదట ఎటువంటిపాపములు చేయుట లేదని పుట్టి ప్రతిజ్ఞ చేయుట; 4_ది. తానుచేసిన పాపములను ఒకటినయినా దాచకుండా గురువుతో చెప్పుట; 5_వ. గురువు కట్టడచేసిన అపరాధము తప్పక తీర్చుట.

సత్ప్రసాద అరుహ్నము.

ప్ర. సత్ప్రసాదములో నేంచేసియుండెడువా రెవరు?

ఉ. జేసునాథస్వామి.

ప్ర. అందులో ఎట్లా వేంచేసియున్నారు?
ఉ. తమ దివ్యఆత్మతోను, దివ్యశరీరముతోను, దివ్య రక్తముతోను, దేవస్వభావముతోను నిజముగా వేంచేసియున్నారు.
ప్ర. అందుచేత సత్ప్రసాదము తీయునప్పు డేమితీయు చున్నాము?
ఉ. మన దివ్యకర్తయైన జేసునాధుని దివ్యశరీరమును ను, దివ్యరక్తమునను దివ్యఆత్మమునను దేవస్వ భావమునను లోకొనుచున్నాము.

ప్ర. సత్ప్రసాదమందు అప్పము లవలేశమైననుకలదా?
ఉ. అప్పముయొక్క రూపము, రుచి, మొదలగు గుణములుండినను అప్పము లేదు.
ప్ర. అప్పము ఏమాయెను?
ఉ. జేసునాధుని దివ్యశరీరముగా మారిపోయెను.
ప్ర. ఇటువంటిస్వామియెవరియొద్దకు వచ్చుచున్నారు?
ఉ. పాపాత్ములుగాను నీచులుగాను ఉండెడు మన యొద్దకు వచ్చుచున్నారు.
ప్ర. మనయొద్దకు ఎందుకువచ్చుచున్నారు?
ఉ. మనముచేసినపాపముల నన్నిటిని ఓర్చి మనకు ఆశీర్వాదమిచ్చుటకు వచ్చుచున్నారు.

ప్ర. ఇటువంటిస్వామి మనయందు వేంచేసియుండు నప్పుడు వారిని మనమేమి అడుగవలెను?

ఉ. భక్తి, విశ్వాసము, నమ్మిక, దేవస్నేహము, దీనత్వము, ఓర్పు, విరక్తత్వము, ఇవి మొదలయిన పుణ్యములను అడుగవలెను.

ప్ర. సత్ప్రసాదమును లోకొనుటకు ఎన్నివిధఆయత్తములు కావలెను?

ఉ. ఆత్మఆయత్తము, శరీరఆయత్తము, అను రెండు విధఆయత్తములు కావలెను.

ప్ర. ఆత్మఆయత్తమనగా నేమి?

ఉ. ఆత్మము చావైన పాపములేక పరిశుద్ధముగానుండుటకై మంచిపాపసంకీర్తనము చేసియుండవలెను.

ప్ర. శరీరఆయత్తమనగా నేమి?

ఉ. అర్ధరాత్రినుండి సత్ప్రసాదము లోకొనెడువరకు ఏమిటినిభుజించకయును, త్రాగకయును, వక్కాకు మొదలయిన యితరవస్తువులను నోటవేయిక యును శుద్ధయూపవాసముగా నుండవలెను.

ప్ర. జేసునాథస్వామి సత్ప్రసాదము కలిగించిన ముఖాంతరములేవి?

ఉ. 1_ది తమ మరణమును జ్ఞాపకపరచుట.
2_ది అర్చ్యశిష్టసభకు తోడుగానుండుట.
3_ది మనఆత్మలకు దివ్యభోజనముగానుండుట.
4_ది తాము స్లీవలో సమర్పించినబలిని ఎన్న టె
న్నటికిని పూజలో నడిపించుట.

---

## భద్రమైన అభ్యాంగపు జ్ఞానోపదేశము.

ప్ర. భద్రమైన అభ్యాంగమనగా నేమి?
ఉ. మనలను సత్యవేదములో దృఢపరచుటకు స్పిరి
తుసాంతును వారి వరప్రసాదములనును సంపూ
ర్ణముగానిచ్చి మనలను ఉత్తమక్రీస్తువులు గా చే
యు దేవద్రవ్యఅనుమానము.
ప్ర. స్పిరితుసాంతుయొక్క వరప్రసాదములెన్ని?
ఉ. ఏడు. 1 జ్ఞానము, 2 బుద్ధి, 3 వివర్శ, 4 దృఢ
ము, 5 తెలివి, 6 భక్తి, 7 దేవభయము.
ప్రం ఇంక భద్రమైన అభ్యాంగమువలనవచ్చెడు అను
గ్రహము లేవి?
ఉ. స్పిరితుసాంతువైన సర్వేశ్వరుని 12 జ్ఞానవరము
లు, అవి ఏవనగా
1_ది పరస్నేహము 2_ది జ్ఞానసంతోషము

3_ది సమాధానము   4_ది ఓర్పు
5_ది దయ   6_ది మేలెరిగినతనము
7_ది తాళిమి   8_ది శాంతము
9_ది విశ్వాసము   10_ది మర్యాద
11_ది నిగ్రహము   12_ది విరక్తత్వము

ప్ర. నిత్యభాగ్యమును పొందుటకు ఈ దేవద్రవ్యానుమానమును గ్రహించుట అవసరమా?

ఉ. లేదు, కూడినప్పుడు, అశ్రద్ధచేత దానిని పొందని వారలు ఘనమైన అనుగ్రహమును పోగొట్టుకొని స్వామి సముఖములో అపరాధు లగుచున్నారు. తిరస్కారముగా దానిని పొందకపోయిరేని చావైన పాపమును కట్టుకొనుచున్నారు.

ప్ర. ఇట్టి దేవద్రవ్యానుమానమును యోగ్యముగా పొందుటకు చేయవలసిన ఆయత్తమేమి!

ఉ. సత్యవేదప్రధానబోధనలన్నిటిని చక్కగా నేర్చుకొని స్పిరితుసాంతును పొందుటకు ఆశించి చావైన పాపములేక యుండవలెను. చావైన పాపముతో తీసెడువారలు దేవద్రోహమును కట్టుకొనుచున్నారు.

ప్ర. ఎన్నిమారులు భద్రమైన అభ్యాంగమును పొంద వచ్చును?

ఉ. భద్రమైనఅభ్యాంగము ఆత్మమునందు అతిశయ మైన ముద్రను స్థాపించుచున్నదిగనుక ఒకేసారి మాత్రము పొందవచ్చును. ఎక్కువమారులు పొందిరేని మహాఘనమైన పాపమగును.

ప్ర. ఈదేవద్రవ్యానుమానమును ఇయ్య అధికారము గల వారెవ్వరు?

ఉ. మేత్రాణులు.

ప్ర. ఈదేవద్రవ్యానుమానమును ఇచ్చునప్పుడు మేత్రాణులుచేసెడు సాంగ్యములలో మొదటిది ఏమి?

ఉ. భద్రమైన అభ్యాంగమును పొందపొయ్యెడు వారలమీద తమ చేతులను చాపి స్పిరితుసాంక్తువైన సర్వేశ్వరుడు వారలమీదవేంచేసిరావలయునని వేడుకొనుచున్నారు.

ప్ర. రెండవది ఏమి?

ఉ. "స్లీవగురుతుచేత నిన్ను గుర్తించి పితరయొక్కయు, సుతునియొక్కయు, స్పిరితుసాంక్తుయొక్కయు నామముచేత రక్షణముయొక్క క్రిస్మా

(అను పరిమళతైలము)తో నిన్ను భద్రించుచున్నా
ను" అని చెప్పుచు, మేత్రాణులు క్రిస్మాఅనెడు
పరిమళతైలముతో నొసటిమీద స్లీవగురుతుగా
లేపనముజేయుచున్నారు.

ప్ర. ఈసాంగ్యమునకు అర్థమేమి?

ఉ. భద్రమైన అభ్యాంగమును తీసినవాడు ఎప్పటను
జేసునాధుని సువాసనగానును ఇతరులకు పు
ణ్య మాతృకగానును ఉండవలెను, అనుటే.

ప్ర. మూడవది ఏమి?

ఉ. నీకు సమాధానము కలుగునుగాక అని చెప్పుచు
చెంపన తట్టుచున్నారు.

ప్ర. దీనికి అర్థమేమి?

ఉ. విశ్వాసముకొరకును, దేవస్నేహముకొరకును సక
లవిధ నిర్బంధములను అనుభవించ అయత్తమై
యుండవలెననుటే.

ప్ర. భద్రమైన అభ్యాంగమును పొందినవెనుక చేయ
వలసినదేమి?

ఉ. మూడుకార్యములను జేయవలెను.

1_ది. మనకు జేసిన ఈగొప్ప యుపకారము నిమిత్తమై స్వామికి మేలెఁగిన స్తోత్రముజేసి మనము పొందినటువంటి స్పిరితుసాంక్తువైన సర్వేశ్వరుని యొక్క అనుగ్రహములను మనయందు స్థిరపరచవలెనని వారిని వేడుకొనుట. 2_డి. ఇకముందర ఎచ్చరికతో పాపసమయములను తప్పించుకొనుట 3_ది. మనము స్వామికి ప్రియపడి మోక్షమును పొందునట్లు పుణ్యములనుజేయు సర్వప్రయాసపడుట.

---

